# రామభూపాలశతకము.

గ్రంథకర్త:
పెన్మెత్స రాజంరాజు,
చోడవరం.

1950.



 [ వెల రు. 0—8—0

# పీ ఠి క

లాక్షణికులు శతక కవులను సామాన్యులుగా త్రోసి రాజన్నారు ఎందులకో; ఏ మహాకవి శతకము వ్రాయక యున్నాడు? తిక్కన, పోతన, ధూర్జటి, అడిదము సూరకవి మున్నగాఁ గల మేటికవులందఱు నేఁటిదాఁక శతకములు వ్రాసినవారే.

కవి భగవంతుని యెదుట ఆత్మార్పణము శతకములో గావించినట్లు ప్రబంధాదులలోఁ గావింపలేదు. ఒకవిధముగాఁ జూచిన కావ్యకవిత్వముకన్న శతక కవిత్వమే కవికి కష్టము. ఒకేవిషయమును చిలువలు పలవలు పెంచుకొనుచు పోవుట కిందవకాశము చాల తక్కువ కావుననే శతకములలో చర్విత చర్వణములు పునరుక్తులు తప్పనిసరి యగుచున్నవి.

ఈ రామభూపాల శతకము భక్తిరస ప్రధానమైనది. పూర్వశతకముల పోలికలిందు పెక్కులు లేకపోలేదు. అట్లని గ్రంథచౌర్యము లేదు. తన యిష్టదైవమైన రామభూపాలుని సంబోధించి ప్రార్థించి యీరాజంరాజుగారు చరితార్థులైనారు. వీరి యీ భగవద్భక్తి వీరిచే నిఁకముందు ప్రజాక్షేమంకర కావ్యములు వ్రాయించుగాక.

విక్రమవిలాస్,
తణుకు.
23—2—1950.

ఇతి
శివమ్,
పండిత సత్యనారాయణరాజు.

శ్రీరస్తు.

# రామ భూపాల శతకము.

శ్రీ జానకీవరా! శ్రీగజం సేవితా!
దనుజమర్ద్దన యశో వనధిరాజ!
శంబరారి జనక జంభారిసన్నుత
కరిరాజ వరద! ఓ కలుషహరణ
మకరకుండల ధరా మణిమయాలంకార
సాకేతపురవాస సార్వభౌమ!
నీల నీరదవర్ణ నిర్జరపోషకా!
కంజాతదళనేత్ర గరుడగమన

తే. భక్తజన పారిజాత ఓ పరమపురుష
శ్రిత దయాకార మునిజన చిత్తవాస
దురిత గణనాశ! శ్రీ చోడ వరపురీశ!
భవ్యగుణసాంద్ర రామ భూపాలచంద్ర!

సీ. అరవింద నయన నీ చరణాబ్జములు గొల్చి
చెప్పఁబూనితిఁ గొన్ని సీసములను
అధిక విద్వాంసుండ నని పూనఁగాలేదు
సత్కవీంద్రుల సేవ సలుపలేదు
ఆంధ్ర గీర్వాణమ్ము లభ్యసింపగలేదు
లక్షణశాస్త్రాల శిక్షలేదు
కరుణతో నాకృతి న్నారవేర్పవలె ప్రభూ
శిష్టవందిత నేఁ గృషీవలుండ

తే. కలుషములుబాపి నన్నేలు కమలనాభ
దీనుఁడను గావ రావయ్య దేవదేవ! దురిత॥ 2

సీ. సంష్టల్లి! కమలాక్ష క్ష్మాతలాత్మజపతీ!
శర్వాణి పతినుతా జగతినిన్ను
తెలియఁజాలఁగలేక దేవేంద్ర దిక్పాల
కాబ్జాసనాదు లనంతుడనుచు
పలుకుచుందురు నిన్ను ఫణిరాజశయన నేఁ
బరికించి పొగడ యేపాటివాఁడ
నైన నీదయచేత నాయాసమునకుండ
భక్తినీతులఁ గొన్ని వదలపలుతు

తే. నిర్జరేంద్రారి సుతవంద్య నేఁడు నన్ను
ధన్యుఁజేయంగ రావయ్య అన్యమెఱుఁగ ॥దురిత॥ 3

సీ. శంతను సుతుఁడెన్ని చంద్రహారములిచ్చె
మత్తేభమెన్నిచ్చె మణులునీకు
అల రంతిదేవుఁడే యగ్రహారములిచ్చె
అంబరీషుండేమి అరణమిచ్చె
వనజాననుండెన్ని వలువలర్పించెను
కలహాశనుండెంత కట్నమిచ్చె
ఉడుత నీకేపాటి ఉపకార మొనరించె
దనుజనందనుఁడెంత ద్రవిణమిచ్చె
తే. భక్తజాలమ్ము నీకెంత భక్తినొసగ
వారివలె నన్ను బ్రోవుమో వనజనేత్ర ॥దురిత॥ 4

సీ. కంసాదికుమతులన్ ఖండింప నినువేఁడు
బర్హిర్ముఖుల కెట్టి బాధగలిగె
ద్రౌణిబాణజ్వాల దగ్ధుడై నినువేఁడు
అభిమన్యుసుతునకే యార్తిగలిగె
మకరిబాధనుబాపి మనుపఁగా నినువేఁడు
కరిరాజు కెట్టి యిక్కట్టుకలిగె
భ్రాత బాధనుబాప భక్తితో నినువేఁడు
ద్యుమణిపట్టికి నెట్టి దొసఁగుకలిగె
తే. వేఱె వివరింపనేల నీ వారికెల్ల
కల్పవృక్షమవై యుండ కలదెలోటు ॥దురిత॥ 5

సీ. ఫుల్లసరోజాక్ష పుడమిలోపల నిన్ను
నమ్మియున్నట్టి నన్నరసి ప్రోవు
భార్గవీపతినుతా బల్మాఱు వేఁడెద
దండిగా ననుఁబ్రోచు దాతవనుచు
నాడెందమున నిన్ను నమ్మ్రఁంటుకు చాల
శ్రద్ధతోఁ గావుమో సార్వభౌమ
పూర్వజన్మపు పాపములనెల్ల నడఁగించి
నేర్పుతో నిపుడేలు నీలవర్ణ
తే. జమునిదూతలు ననుఁజేర జంకునట్లు
పంపుమింకను నీదగు బంట్లవేగ ॥దురి॥ 6

సీ. దశరథ నందనా దయతోడఁ గాపాడు
దీనబాంధవ మాకు దిక్కు నీవె!
పన్నగాశనవాహ పాలించు కరుణతో
కంజాతదళనేత్ర! కావుమయ్య
పురవైరి వినుత ఓ సురవైరినాశనా
భవవిమోచన! నామ పరమపురుష
నీపాదకమలమ్ము లేప్రొద్దు జపియించి
పవమానపుత్రుండు భక్తుఁడయ్యె
తే. నిన్నుఁగొల్వని జన్మమ్ము నిష్ఫలంబు
జగతియంతయు నీవెగా జలజనాభ ॥దురిత॥ 7

సీ॥ కీరమ్ము నీపేర నారియొక్కతె పెంచ
త్రిదశాలయమ్ము నా ముదితకీవె
ఆసన్నమరణార్థియై ప్రియాత్మజుఁ బిల్వ
కనికరమ్మున ముక్తి కాంతనీవె
పతిశాపవశమున క్షితి రాతిగానున్న
భామినిఁగాచిన స్వామివీవె
దుశ్శాసనుని బాఱఁద్రోలగా నినువేఁడు
పాంచాలి బన్నంబు బాపితీవె

తే. కర్మసాక్షియు ద్విజరాజుఁ గనులవాఁడ
నమ్మియున్నట్టివాఁడ నన్నటులగావు ॥దురిత॥ 8

సీ॥ పంచభౌతిక శల్యపంజరం బీమేను
జీవుండు కర్మచే చేరునిందు
శతహాయనమ్ములు క్షితినాయువందురు
సత్యమ్ముగాదది జలధిశయన
బాల్యకాలముననో ప్రాయమ్మునందునో
కౌమారవార్ధక కాలములనొ
వారిమధ్యమునందొ వనభూములందునో
బంధుమిత్రులుగల్గు భవనమందొ

తే. అవని వీడుటయెప్పుడో యెవరికైన
వశమె? తెలియంగ? దయనేలు వనరుహాక్ష ॥దురిత॥ 9

సీ. వేదశాస్త్రమ్ములు విరివిగాఁ గనరావు
గొల్లసుద్దుల కథల్ పెల్లుమీఱు
గద్యపద్య విచిత్ర కవితలు కొఱగావు
పారశీకోక్తులే పనికివచ్చు
పండితులనుఁ బ్రోచు ప్రభువులెందును లేరు
కవిరాజులకు పొట్ట గడువఁబోదు
వర్ణాశ్రమమ్ములు వాసిగా నడువవు
పాషండమతములు ప్రబలుచుండు

తే. ధాత్రిలో కలి మహిమమ్ము దలుపవశమె
గుహునకైనను శతకోటి వహునకైన ॥దురిత॥ 10

సీ. వారిజదళమందు నీరముండనియట్లు
ఆదర్శమున రూప మంటనట్లు
ఆకసమ్మున తార లంటియుండనియట్లు
బలుచల్లలో వెన్న గలియనట్లు
బురద నాకుమ్మరిపురుగు నంటనియట్లు
గగనమందున గాలి కలియనట్లు

తే. బుద్ధిమంతులు దేహ మబద్ధమనుచు
తిరుగుచుందురు పృథివి సంసగణవీడి ॥దురిత॥ 11

సీ॥ హారితీర్థమందు ని న్నర్చింపఁదలఁచిన
మార్గప్రయాసంబు మనుపఁజాల
పుణ్యంపు క్షేత్రముల్ పూజింపవలెనన్న
నీమ మధికముగా నిలుపలేను
ఘనసమాధిని ముక్తి గాంచవచ్చునటన్న
నిమిషమైన మనమ్ము నిలుపలేను
కంసారి నీపాద కమలముల్ సేవింప
పరమవైకుంఠమే ప్రాప్తమగును

తే. భక్తమందార నినుఁగొల్చు నే మఱంద
కరుణమీరంగ గావు నీ దాసుఁడీపి ॥దురిత॥ 12

సీ. వసియింపగా నీకు వసతిలేకుంటచే
క్షీరసాగరమందు చేరినావు
పవ్వళింపగ నీకు పాన్పు లేకుంటచే
నురగతల్పమ్ముపై నొరగినావు
వైరులపై బోవ వాహనమ్ములులేక
పన్నగాశనుపైన్ బరఁగినావు
వసుధలో జనులంత వచ్చి వేఁడెదరంచు
దాసుల హృదయాల దాగినావు

తే. ఇట్టివాఁడవు నన్నెట్లు లేలగలవు?
వినవలేకుంటి కటకటా వెఱ్ఱినగుచు ॥దురిత॥ 13

సీ. క్రతుభుజులందున కమలాసనునిరీతి
నగములందున మేరునగము భంగి
ఘనమృగమ్ములయందు గజరిపుమాడ్కిని
చుక్కలం దరయగా సోముభంగి
అరయ వృక్షములందు హరిచందనముమాడ్కి
జిహ్మగమ్ములయందు శేషుభాతి
అవని సామజములం దైరావతముమాడ్కి
వరకవీంద్రులయందు వ్యాసురీతి

తే. భువిని శ్రేష్ఠమ్ములగుచునో భోగిశయన!
నీదు అవతార కథలొప్పు నీలదేహ ॥దురిత॥ 14

సీ. శ్రీరామ నీదివ్య! చింతనామృతముచే
భవపాశముల! నెల్లఁ బాపవచ్చు
శ్రీరామ నీదివ్య! చింతనామృతముచే
ధర్మనిదూతల దఱుమవచ్చు
శ్రీరామ నీదివ్య! చింతనామృతముచే
చెడురోగములనైనఁ జెండవచ్చు
శ్రీరామ నీదివ్య! చింతనామృతముచే
పరమవైకుంఠమే! పడయవచ్చు

తే. నీదు నామమ్ము వర్ణింప నేరితరము
కాదు భవదీయ కృపలేక కమలనయన ॥దురిత॥ 15

సీ. సూకరాకారివై సురవిరోధుండైన
నీచు హిరణ్యాక్షుఁ బీఁచమడఁచి
మత్స్యావతారివై మడుగులోపలఁ జేరి
సోమకాసురుఁ జంపి శ్రుతులగాచి
కూర్మావతారివై కూలినగిరినెత్తి
అమరుల కమృతంబు నరసిపోసి
కృష్ణావతారివై కృపణుల వధియించి
జననికి కుక్షిలో జగతిఁ జూపి

తే. తమిత గుణరూప నీచరితామృతమును
తెలియ వశమౌనె యజునకు దీనపోష ॥దురిత॥ 16

సీ. సంసారమను దుఃఖ సాగరమ్మును దాఁట
నీభక్తినావయే నిర్గుణాత్మ
బ్రహ్మహత్యానేక బడబాగ్నులార్పంగ
నీదాస్యవృష్టియే నిర్మలాత్మ
అజ్ఞానతిమిర మహాంధకారముఁ బాప
నీదయాకాంతియే నీలవర్ణ
ఘోరపాపమ్ముల గ్రుంగెడి ననుగావ
నీపాదసేవయే నీరజాక్ష

తే. నీదునామంబు జపియింప నేర్చికాదె
కమలసంభవ హరులు నిన్ గాంచినారు ॥దురిత॥ 17

**సీ.** మాధవా యని నిన్ను మఱువక సేవింప
గ్రాసమెందుకు నాకుఁ గట్టుకుంటి?
ఘనముగా నీయొద్ద ధనము లేదందువా!
కుండలమ్ములు నేఁడె! కుదువఁబెట్టు
కౌస్తుభమణి నమ్ము ఖడ్గచక్రములైన
అమ్ము మెంతకునైన నంబుజాక్ష
పసిఁడికిరీటమ్ము పట్టుపుట్టమ్ముల
నేఁడె విక్రయింపు నిశ్చయముగ

తే. అమ్మి నిరతంబు జీతమ్ము లంపవేసి?
నిన్ను సేవింపగానొల్ల నిజము నమ్ము ॥దురిత॥ 18

సీ. కలిమి నీ కేమైన కఱవయ్యె ననుకొన్న
భార్గవీదేవియే భార్యయయ్యె
కైలాసపతినైన కరఁగింపజాలిన
చతురుఁడౌ మారుడే సుతుఁడు నీకు.
జగతిఁబ్రకాశించు జలజాప్తచంద్రులే
నేత్రద్వయము నీకు నిశ్చయముగ
పరమపావనియంచు బిరుదుగాంచి చరించు
గంగాభవాని నీ కనుఁగుబిడ్డ

తే. ఇంతసంపద నీచెంత నిమిడియుండ
దాసులగు మాకు బోనంబు తక్కువౌనె? ॥దురిత॥ 19

సీ. సామజమ్ములఁబట్టి చప్పు సింహకిశోరి
తినజూచునే దీర్ఘ దేహిగముల
హరిచందనపు తేనె లారగించెడి తేటి
పోవునే పచ్చిక పూలకడకు
మృదు చూతపత్రముల్ మెక్కుచున్న పికంబు
కొఱకునే భువి పాలకోడిసెచిగురు
భవ్యమౌ ఫలములన్ భక్షించు కీరంబు
మెక్కునే చేరి ఉమ్మెత్తకాయ

తే. సర్వదా నిన్ను సేవించు సజ్జనుండు
అల్పదైవమ్ములనుగొల్వ నాశపడునె ॥దురిత॥ 20

సీ. సనకాది సంయమి జాలమ్ము నిరతమ్ము
జపియింతు రెవ్వాని స్వాంతమందు
నారదాదిమునులు నలుమొగమ్ముల వేల్పు
ప్రణుతించిరెవ్వాని భక్తితోడ
వాల్మీకి వ్యాసాది వరకవీంద్రులు మున్ను
వర్ణించి రెవ్వాని వసుధయందు
కమలాలయమువీడి కమలయే నిరతమ్ము
సేవించె నెవ్వాని చిత్తమెరిగి

తే. అట్టి నీపాదజలజమ్ములమలచరిత!
నాదుమస్తకమ్మునదాల్తు నళిననాభ ॥దురిత॥ 21

సీ. సౌధగేహమ్ములే శాశ్వతమ్మనినిర్మించి
నిక్కుచుండే పిచ్చి కుక్కనయ్య
సౌందర్యసౌశీల్య సంపన్నతల నమ్మి
విఱ్ఱవీగి చరించు వెఱ్ఱినయ్య
పశుధనమ్ములు పెక్కు పంటలు గలవని
గర్వమ్ముచెందిన కాకినయ్య
కన్ను మిన్నెఱుగకే కడగండ్లపాలౌచు
కలుషమ్ము నార్జించు ఖరమునయ్య
తే. ఇట్టిమూఢత్వ మిట్లైన నెడలఁజేసి
నీకు దాసునిగాఁగొమ్ము నేటినుండి ॥దురిత॥ 22

సీ. వేదశాస్త్రపురాణ వీథులన్వేషింప
నీవె! దైవమ్మని నిశ్చయమ్ము
బ్రహ్మవిద్యాదిగా బహుగ్రంథములఁజూడ
నీవె! దైవమ్మని నిశ్చయమ్ము
ఉపనిషదర్థమ్ము లూహించి చూచినన్
నీవె! దైవమ్మని నిశ్చయమ్ము
సజ్జనబోధల సారమ్ము విన్నచో
నీవె! దైవమ్మని నిశ్చయమ్ము
తే. వేయిమాట లికేల యీవిశ్వమందు
నిండుకొని యున్నవాఁడవో! నీలదేహ ॥దురిత॥ 23

సీ. ముదిమిచే దేహమ్ము ముడుతలుపడునాఁడు
కనుదోయి మసకలు గొనిననాఁడు
పిల్లలు నిల్లాలు, పీచిపెట్టెడినాఁడు
చేరి శుంఠలు బుద్ధి చెప్పునాఁడు
కుక్కిమంచమ్ముపై కూలియుండిన నాఁడు
చెడు రోగములఁ దెల్వి చెడిన నాఁడు
కింకరుల్ చనుదెంచి కదకుచుండెడి నాఁడు
కటుకుకత్తులమేను నఱుకు నాఁడు

తే. బాధనొందుచు నీనామ భజన మెప్పుడు
చేయజాలుదునో లేదో! చేతునేఁడె ॥దురిత॥ 24

సీ. కలిహేతుకమ్మున కాల ధర్మము మాఱె
న్యాయ మార్గమ్ములు నాశమయ్యె
క్షేత్రమ్ములను పంట క్షీణించు చుండెను
గోరక్షణమ్ములు కూలి పోయె
వ్యాపారములు పెక్కు వ్యాజ పూజ్యమ్మయ్యె
లంచ గొండితనమ్ము లధికమయ్యె
మదమత్సరమ్ములు మానవులకు హెచ్చె
జార చోరతఁముల్ మీఱుచుండె

తే. జీవ హింసలు చాలగా జెలగుచుండె
అవనికిల్బిషముల తోడ నలముకొనియె ॥దురిత॥ 25

సీ. పరనారి కాసించి బాధ పెట్టుటకన్న
పాషాణమై ధాత్రి బడుట లెస్స
చదువు నేర్వకయుండి సభకుఁ బోవుటకన్న
వనములో స్థాణువై మనుట లెస్స
పరివారి కొంపలో మఱిగి మెక్కుటకన్న
సారమేయమ్మగుచు చనుట లెస్స
తన పోషణమ్ముకై దారి గొట్టుటకన్న
బావిలో త్వరితమే పడుట లెస్స
తే. దానవాంతక! నిను దిట్టి ధరణి మనెడి
మందునకు, వేయిరెట్లులా పంది లెస్స ॥దురిత॥ 26

సీ. పసరమ్ములే ప్రొద్దు కసవు గోరుచునుండు
మహిషమ్ము లెప్పుడు మడుగు గోరు
పద్మమ్ము లెప్పుడు భగుని రాకను గోరు
బిసకంఠికలు గోరు బిసము నెపుడు
మధుపమ్ము లెప్పుడు మకరందమును గోరు
మండూకములు గోరు మంచివృష్టి
కలువ లెప్పుడు గోరు చలువల తేనిని
శుకము లెప్పుడు గోరు చూత ఫలము
తే. సుజనుడే ప్రొద్దు నీపాద భజన గోరు
ముదముతో నిన్ను సేవింతు ముక్తిగోరి ॥దురిత॥ 27

సీ. ఋష్యశృంగుండెందు హరిణిగా జన్మించె ?
జంబుకముని యెందు జన్మమందె ?
కౌశికుండని యెడి ఘనుఁడెందు ప్రభవించె ?
నారదుండే యింట నవతరించె ?
అల్లమాతంగుఁడెం దవ తారమెత్తెను ?
మాండవ్యుఁడే రీతి మహిమాని పుట్టె ?
వ్యాసుడేకుల మందు వాసిగా నుదయించె ?
గౌతమముని యెందుఁ గడగి పుట్టె ?

తే. భక్తులెచ్చోట నుదయించి పెంపొందెనయ్య
నీదు సేవకులకు జాతి నీతులేల ॥దురి॥ 28

సీ. సతతమ్ము నీనామ సంకీర్తనమ్ములు
నోరు నొవ్వంగను నుడువ వలయు
సంతోషమున నీదు చరణ ద్వయమ్మును
ముప్రొద్దు భక్తితోఁ మ్రొక్కవలయు
కమలనాభా! నిన్ను ఘన వనమ్ములనైన
భక్తి యుక్తమ్ముగా పాడవలయు
నరహరీ! నీదివ్య నామ రూపమ్ములు
హృద్వీధి ననయమ్ము! నెంచవలయు

తే. సర్వమును నీమయమ్మని చాట వలయు
భేద వాదమ్ము తగదయ్య పృథ్వి నెందు ॥దురిత॥ 29

సీ. అనిశమ్ము నీదు దివ్యవతార కావ్యముల్
గల్పింప నే గొప్ప కవిని గాను
సావధానముగ నీ చరణాబ్జములు గొల్చి
తరియింప నేను ఉత్తముడ గాను
నీ భవ్యచరితముల్ నేర్పుతో కొనియాడి
హాయిగా పాడ గాయకుడ గాను
కోమలాంగా! నీదు గుణగణ జాలమ్ము
వర్ణింప నే మహావక్త గాను
తే. నీచమతి నయ్య సర్వేశ నేడు నన్ను
నీదు దాసునిగా గొమ్ము నీరజాక్ష ॥దురిత॥ 30

సీ. వనజాయతాక్ష నావంటి దాసులు కొన్ని
వందల వేలు యీ వసుధ గలరు
ఇంత సమూహమ్ము చెంత నుండెనటంచు
మావంటి దీనుల మఱువకయ్య
కరిరాజవరద నీ కరుణామృతమ్మును
నాకొసంగుము వేగ నళినగర్భ
వేగమ్మె చనుదెంచి విహగవాహన గావు
కామితార్థములిమ్ము కంజ నేత్ర !
తే. ఎంత వేడిన దర్శన మీయకున్న
తగవు సేయుదు నిది యథార్థమ్ము నమ్ము ॥దురిత॥ 31

సీ. పుండరీకాక్ష నిన్ బూజించు వారికి
ప్రాక్ జన్మ దురితంపు భయమ దేల!
నారాయణా! నీదు నామామృతమ్ముండ
అన్యోదకమ్ముల కడల నేల?
దామోదరా! నీదు దయగల్గువారికి
దేహమ్ముపై కొంత మోహమేల?
పురుషోత్తముని నామ పోతపాత్రమ్ముండ
సంసార వనధిలో సమయనేల?

తే. నరసఖా నిన్ను సేవించు నరవరుండు
ముందు నరకమ్ముకల నంచుకుంద నేల ॥దురిత॥ 32

సీ. ఉర్విలోపల తనవున్నంత కాలమ్ము
విషయ లోలుండౌచు వెఱ్ఱి నరుడు
పంచేంద్రియములచే వంచితుండై యుండి
సంచితమ్ము ననుభ వించుచుండు
సకల పాపమ్ముల సమకూర్చు కొనుగాని
నిను జేరుమార్గమ్ము నెఱుక బోడు
అవసాన కాలమ్ము నరయుచు శమనుని
దూతలు గొంపోవ భీతితోడ

తే. దీనతను జెంది మూర్ఛిల్లి దిశలు చూడ
తన్ను గాపాడ వచ్చెడి దాతలేరి ॥దురిత॥ 33

సీ. ఎన్నాళ్ళ నుండియో సన్నుతింపుచు నుండ
మోమైనఁ జూపవే మురవిదారి
పుండరీక దళాక్ష కెంపు కన్నులతోడ
నినుఁ గాంచుభాగ్యమే దినముననగు
పతితపావనుఁడంచు పలుకురందురు నిన్ను
బాపాత్ముఁగాపాడ సమయమగును
తార్క్ష్య వాహనముపై దయతోడ నరుదెంచి
ననుఁ బవిత్రునిఁ జేయు నళినగర్భ
తే. వేగముగ నన్ను నీ వెంట విశ్వరూప
స్వర్గలోకమ్ము చేర్పుమో నిర్గుణాత్మ ॥దురిత॥ 34

సీ. మాధవా! యని నీకు మనమర్పణముచేయు
వారినిర్వాణ మెవ్వరికి లేదు
శౌరీ! యటంచునిన్ జాలగా వినుతించు
వారినిర్వాణ మెవ్వరికి లేదు
అంభోరుహాక్ష! నీ అవతార కథ విను
వారినిర్వాణ మెవ్వరికి లేదు
కౌసల్య సుతు పాద కంజాతములు గొల్చు
వారి నిర్వాణ మెవ్వరికి లేదు
తే. లేదు దుర్వాదనమ్ములు లేదు ముక్తి
భక్తిమార్గమ్మునంజన ముక్తి గలుగు ॥దురిత॥ 35

సీ. సర్వదా నీనామ స్మరణజేసెడి నోరు
వదరుబోతులతోడ వాగదెపుడు
కమనీయమగు నీదు కథవినుకర్ణముల్
పాపవార్తలు విన భ్రాంతిపడవు
క్రమముగా నీపాద కమలమ్ములర్చించు
కరములే పనులకుఁ గదలిరావు
భవదీయ భజనకై పరువెట్టు చరణముల్
చనజాల వెచటికి జనముతోడ

తే. మఱువకెప్పుడు నినువేఁడు నరవరుండు
మర్త్యులను గొల్వనేరఁడు మంచిదనుచు ॥దురిత॥ 36

సీ. బిసకంఠికను తెచ్చి ప్రేమతోఁ బెంచిన
మానసౌకమ్మట్లు మసలగలదె?
పికవర్ధనిని తెచ్చి పెక్కేండ్లు గఱపిన
పరభృతమ్మట్టులు పాడగలదె
కుక్కుటమ్మును దెచ్చి మక్కువతో మేప
కీరమ్ముగతిపల్క నేరగలదె?
మహిషమ్మునకు చాల మచ్చికచేసిన
అరుగునే దురమందు హయమువలెను

తే. క్షితిని పాపాత్మునీదగు సేవకుంచ
చేయనేర్చునె భక్తితో చిత్తమలర ॥దురిత॥ 37

సీ. రతినాధఁ జనక నీ వ్రతమహిమమ్ముచే
రుక్మాంగదుఁడు రాజవృషభుఁడయ్యె
నిర్వాణనాధ నీ నియమవ్రతమ్ముచే
అంబరీషుండు మున్ననఘుఁడయ్యె
బాల్యమప్పటినుండి భక్తితో నినుఁగొల్చి
ప్రహ్లాదుఁడును గొప్ప భక్తుఁడయ్యె
బలిచక్రవర్తి నీ పాదాబ్జములనాల్చి
పాతాళలోకాన ప్రభువునయ్యె

తే. పుణ్యపురుషులు నీపాద పూజవలన
శివములందుచు నాకమ్ము చేరిరయ్య ॥దురిత॥ 38

సీ. ఉన్మాదమున చావనున్నట్టి పులి గావ
చని తీయువానిని చంపకున్న?
చిచ్చులోఁ బడనున్న వృశ్చికమ్మును దీసి
మేలుగోరినవాని మీటకున్న?
బురదలో చిక్కిన పోట్లావుగని వేగ
పోయి లాగెడువాని పొడువకున్న?
బావిలో పడనున్న పామును పొడగని
కాపాడువానినిఁ గఱువకున్న?

తే. కష్టపడుచున్నవాడంచు దుష్టమతిని
చేరదీసెడివారలఁ జెఱుపకున్నె ॥దురిత॥ 39

సీ. అవధారు కమలాక్ష హర్యక్ష ఘనవక్ష
అఖిలలోకారాధ్య అమితరూప
నీవంటి మహనీయు నేర్పుతో నుతియించి
కుటిలమానవులనే కొలువనేర
నీవె దైవమ్మని నే చాల వేఁడిన
నా ప్రదక్షిణముల నరయవేమి
యెన్నాళ్ళనుండియో యిడుముల బడుచుండ
కొంచెమైన ధనమ్ము గూర్పవైతి
తే. అమరపతిపోష నేనిట్లు శ్రమలుపడఁగ
జూచుచున్నాఁడవిది నీకు చోద్యమయ్య ॥దురిత॥ 40

సీ. శతకోటి రవితేజ దితిసుతసంహార
బ్రహ్మాదివినుత శ్రీభక్తలోల
జనకమాంధాతాది జనలోకపతులకు
దివ్యమోక్షమిచ్చావె దేవదేవ
సుత్రామునకు నాఁడు సురపదంబీనెంచి
పొట్టివడుగువౌచుఁ బుట్టలేదె
ఉగ్రసేనుని పుత్రిక కుదయించి యల్ల నా
దుద్ధవాద్ధులనెల్ల నుద్ధరించి
తే. నటుల నన్నును గాపాడ నిటకువచ్చి
ధన్యుఁజేయుము మఱునక దాసునిపుడు ॥దురిత॥ 41

సీ. కంబమందు జనించి కరుణతోఁ డుత నాఁడు
దైతేయుఁ జంపవే తనయుఁ గావ
భండనమ్మున మున్ను పౌలస్త్యుఁ దెగటార్చి
బ్రాహ్మణులకు భీతిఁ బాపినావు
ఒక ధేనుకాసుర బలవద్రిపులఁ గూల్చి
అచలాభరమ్ము మున్నడఁచినావు
మోహినివై తొల్లి మూఢ దైత్యుల వంచ
నము చేసి గర్వమ్ము నడచినావు
తే. సాధుజనులను గావంగ సమరమందు
క్రూరులను జంపు నిన్ను నేఁ గొల్చువాఁడ ॥దురిత॥ 42

సీ. ముదిరదేహా! నీదు మోముతో సరిరాక
కలువలఱేనికిఁ గళలు తగ్గ
విశ్వంభరా! నీదు వీరత్వమును విన్న
దనుజుల గుండెలు తల్లడిల్ల
కంసారి! నీదగు ఘనత వెల్లడిగాగ
పవనాశనుండు నీ పానుపయ్యె
కమల దళాక్ష! నీ కాంతి నందరెఱుంగ
కుసుమేషుఁడే నీకు కొమరుఁడయ్యె
తే. కడలి కూతురు నిన్నుఁ దా విడువలేక
పట్టమహిషి యయ్యెనో పద్మనాభ॥ దురిత॥ 43

సీ. దానమ్ము చెఱుపఁ గాఁ దల పోయువారును
మాయచే కొంపలు మాపువారు
భక్తుల న్నిరతమ్ము బాధించు వారును
నీ మందిరము గూల్చ నెంచు వారు
పొరుగు సంపదగాంచి పొక్కుచుండేవారు
పరకాంతలకు నాశ పడెడివారు
పేదవారలఁ బట్టి పీడించు వారును
సాధు గోవులఁ బట్టి చంపువారు
తే. జముని దూతలు పట్టుక చావమోద
భీతి నొందుచు నిరయాన వెతలు పడరె॥ దురిత॥ 44

సీ. భూరి సంపదకునేఁ బొగడుచుండుట లేదు
ధాత్రి గొప్పకుఁ నిన్ను దలుపబోను
యశమిమ్మటంచునే నాశింపఁగా లేదు
క్షేత్రమ్ములకు నిన్ను చేరఁబోను
స్వర్గ మిమ్మా! యంచు సన్నుతించుట లేదు
భాగ్యమ్ములకు నిన్నుఁ బట్టబోను
పుట్టమ్ములిమ్మంచుఁ బట్టు పట్టగ లేదు
వేశ్మమ్ము లిమ్మంచు వేఁడబోను
తే. కాని కోరిన దొక్కటే కంసవైరి
మోక్ష మొసఁగిన జాలునో మురవిదారి॥ దురిత॥ 45

సీ. పితిహోత్రుని గాంచి మేతను భ్రాంతిచే
చనియందు బడి చచ్చు శలభమట్లు
గాలమ్ము నందున్న గండూపదికి నేగి
సమసి పోయేటి విసారమట్లు
శబరుండు వనమందు చల్లు గింజలు దినఁ
బోయి హాతమగు కపోతమట్లు
పచ్చని పైరులో మచ్చికన్ దిననేఁగి
ఉచ్చులోఁబడి చచ్చు ఉడుత యట్లు

తే. ఆశచేతను గామియై యువని నరుఁడు
ఘోరమైనట్టి దుర్గతిం గూలుఁగాదె?॥ దురిత॥ 46

సీ. ఇందీవరశ్యామ వందనమ్ములు నీకు
కందర్పజనక నన్ గావరావె?
సుత్రామవినుత నీ సుందర చరణముల్
కనుగొను భాగ్యమ్ము గలదె? నాకు
హరి నీ పదాబ్జమ్ము లర్చింపఁ గోరెడి
నావంటి దీనుల నరయ వేమి?
పాప కర్ముడ నంచుఁ గోపగింపకుమయ్య
కాపాడగా నేఁడె కదలిరమ్ము

తే. ఆర్త జనపోష నిన్ గొల్చు అధమునైన
కరుణతో గాచి రక్షించు బిరుదు నీదె॥ దురిత॥ 47

సీ. మురసంహారా! నీకు మ్రొక్కని దేహమ్ము
సత్యమ్ముగా నొక్క స్థాణుగాదె?
కామారివినుత! నీ కమనీయ కథవిని
కరుఁగని హృదయముల్ గండశిలలె
పురుషోత్తమా! నినుఁ బొగడఁ జాలని నోరు
ఘనశైలమున గల కందరమ్మె
దైత్యారి! నినుఁజూడ దలుపని నయనముల్
కృకలాసముల గ్రుడ్లు కృష్ణవర్ణ
తే. జగతి నినుఁ బూజచేయని జనుని కంటె
పచ్చికన్ దిని బ్రతికెడి పశువు మేలు॥ దురిత॥ 48

సీ. పరనారి కుచకుంభ పరిరంభణము గోరి
సింహబలుండు మున్ జీల్చఁబడియె
పరనారి కుచకుంభఁ పరిరంభణము గోరి
సక్రన్దను సుతుండుఁ నమసిపోయె
పరనారి కుచకుంభఁ పరిరంభణము గోరి
అల దశకంఠుఁడు హతమునందె
పరనారి కుచకుంభఁ పరిరంభణము గోరి
నహుషుండు పూర్వమ్ము నాగమయ్యె
తే. భువిని పరదార కాసించు పురుషపశువు
ప్రొద్దు కొమరుని బంట్లచే పొడువబడఁడె॥ దురిత॥ 49

సీ. దిష్టాంతమగు నాఁడు తెల్వి గోల్పోయి ని
న్నేడు గొందునో లేమ? విశ్వరూప
ప్రాణమున్నప్పుడే భక్తి భావమ్ములో
స్మరియించువాడ నోసారసాక్ష
అవసానకాలాన నతివేగ జముబంట్లు
గొనిపోవకుండ నో కూర్మరూప
భవదీయ దూతలన్ బంపుమా ననుఁగావ
పన్నగాశనవాహ పద్మనాభ

తే. భక్తి నినుఁ గొల్చు నట్టి యశక్తుఁడఁ జూమి
అరసి గాపాడుచుండు మో [illegible]సురవైరి॥ దురిత॥ 50

సీ. కరిబృందములఁజాడ కంఠీరవమెయుండు
వృకముండు బిలమును వృషభమెయుండు
మంచి పూఁదేనెను మధుమక్షికమెయుండు
భూదారములజాడ బోయఁడెయుఁగు
శశముండు తావులు శ్వానమ్మెయుండును
ధాత్రి పల్లమ్ము నుదకమెయుండు
రత్నముండెడితావు రాజహంసమెయుండు
ప్రజల కర్మమ్ములు రవిమెయుండు

తే. నిర్గుణాత్మకులగు వారి నిందిరేశ
పరమ సుజ్ఞానిమైనట్టి భక్తుఁడెయుఁగు ॥దురిత॥ 51

సీ॥ కామారి! వినుత నీనామమ్ము సోఁకిన
పాపసంఘములెల్లఁ బాసిపోవు
దనుజసంహార! నిన్ను దలఁచినయట్టిన
రాగాదిగుణములే రావు దరికి
బిసరుహాక్షా! నిన్ను పేర్కొనినంతనే
ఈషణత్రియమే నశించిపోవు
మురసంహారా! నిన్ను మఱువక స్మరియింప
పంచేంద్రియమ్ముల భ్రమలువీఁడు

తే॥ నిర్జరేంద్రాది సన్నుతా నిన్నుగొలువ
తరణి పుత్రుని దూతలు వెఱచిపోరె ॥మురిత॥ 52

సీ. భారతీపతినుతా భవదీయనామ మే
ప్రొద్దును స్మరియించు పుణ్యులకును
సంతతమ్మును నమస్కారమ్ములొనరించి
ప్రస్తుతింతును దేవ ప్రతిదినమ్ము
ధనముచే గర్వించి తనువెఱుంగనివారి
చెంతఁజేరి నుతింప శేషశయన
తామె శ్రేష్ఠులమంచు దర్పించువారలఁ
దలుపఁబోనెప్పుడో! దనుజవైరి

తే. చిత్తమలరంగ నినుఁగొల్చు శిష్టజనులఁ
జేరి పూజింతు సర్వదా చిత్తగింపు ॥మురిత॥. 53

సీ॥ రాజ్యమ్ము పాలించు రాజేంద్రుఁడైనను
మహి దున్ని జీవించు మనుజుఁడైన
ఉద్ధారములనిచ్చు ఊరవ్యుఁడైనను
కూలిచే బ్రతికెడి మాలవాఁడైన
కదనభూమి చరించు ఘనవీరుఁడైనను
భయముచే బరువెట్టు పందయైన
కావ్యముల్ రచియించు కవివరేణ్యుండైన
యేవిద్యయెఱుఁగని హీనుఁడైన

తే॥ భక్తిభావమ్ముతో నిన్ను ప్రస్తుతింప
మోదమునవచ్చి బ్రోతువో మురవిదారి ॥దురిత॥ 54

సీ. చండాలుఁడని నన్ను జనసంఘ మననిమ్ము
దీనుండనని నన్ను దిట్టనిమ్ము
విప్రలబ్ధినటంచు వెక్కిరింపఁగనిమ్ము
చోరుండనని చాల దూరనిమ్ము
కోపిరా వీడంచు కొందరాడఁగనిమ్ము
అస్వారుండని తూలనాడనిమ్ము
కుత్సితుండని యొరుల్ గోలచేయఁగనిమ్ము
ధీ హీనుఁడంచు నన్ దెగడనిమ్ము

తే. ఎండతేమంచు దూఱిన నిందువదన
వెఱపునా కేల నీవుండ విహగగమన ॥దురిత॥ 55

సీ. పూర్వదేవాంతకా! భూలోకమందున
సత్యవంతులమాట సరకుగొనరు
పండితవాక్కులఁ బాటింపరెవ్వరు
మోసగాండ్రకు చాల మ్రొక్కుచుంద్రు
అధిక విద్వాంసుల నాదరింపగరారు
వదరుపోతులమాట మదినుతింత్రు
పుణ్యాత్ములగువారిఁ బూజింపనొల్లరు
నాస్తికులగువారి నాదరింతురి
తే॥ నీ మహాత్మ్యమ్ములన్ విననేరరయ్య
పాపచరితమ్ములన్ విందు వ్రియమదమొప్ప ॥దురిత॥ 56

సీ. క్షీరోదరశయన కడలికూతురు ప్రియా!
కందర్పజనక ఓ కంసవైరి
శిశుపాల హంతకా! పశులగాచినవేల్ప
హంసవాహను తండ్రి యజ్ఞనాభ
ద్విజరాజ ధరువంద్య దేవేంద్రసన్నుతా
ఆర్తజనావనా అసురనాశ
అనియటంచును నిన్ను అర్చింపుచుందునో
భీభత్స సారధీ ! విశ్వరూప
తే. నాదుప్రార్థననాలించి నగధరుండ
వేగమే దాసు గాపాడ రాగదయ్య॥ దురిత॥ 57

సీ. దేహమ్మె నిజమంచు మోహాబ్ధిలో మున్గి
దరిచేరఁగాలేరు ధరణి నరులు
నరములు శల్యమ్ములురు హేయమ్మైయుండు
మలమూత్రములకిది మఱుగుదొడ్డి
రుధిరమేదో మాంస మదికియుంచిన దేహ
మిదిగాని కనకమిందదుక లేదు
నిమిషమ్ములో జెడునిది యాత్మబోయిన
పాటెంత చెడెనేని బాధపడును

తే. ఇట్టి మాయాంధకారంపు కట్టెమీది
భ్రమను విడచినవాడె ప్రాజ్ఞుడయ్య ॥దురిత॥ 58

సీ. జనకుఁడు జననియు ననుచరులాప్తులు
భ్రాతలు భార్యయు భగినులెంతొ
మందియుండిరటంచు డెందమ్మునందుబ్బి
కంజాతనయన నిన్ గానలేక
సారరహితమైన సంసారమున జిక్కి
యున్నంతకాలమాసన్నమైన
పితృపతిచేతనే భీతినొందుచుఁ జిక్కి
విష్టిననుభవించి కష్టమొంద

తే. బంధుగులువచ్చినా వెతల్ బాపగలరె?
నిన్ను సేవింతు నన్నేలు నేఁటినుండి ॥దురిత॥ 59

సీ. కమలభవామర ఘనులకు వర్ణింప
వశముగాకుండిన వనజనాభ
నీపదాబ్జమ్ములనే శీర్షమున దాల్చి
స్తుతియింతు భారతీపతి నియంత
సతతమ్ము నీదివ్య సంకీర్తనమ్ములే
మానసమ్మున నెంతు మీనరూప
పరమ హేయమ్మైన పాపములకాశించి
దరిజేరి వినుతింప దనుజవైరి

తే. మోక్షమిమ్మంచు నాదినారి ప్రార్థించుచుండి
నిన్ను భజియింతు భారతీనాథ వాడ ॥దురిత॥ 60

సీ. అసురేంద్రవైరి నిన్నర్చించు దాసులు
ముక్తికాంతనుజేరి భక్తినలన
సుఖముబొందుచు చాల ప్రస్తుతికి నీపావ
ధ్యానామృతము గ్రోలి ధన్యులైరి
కమలాసతీప్రియా కంజాక్ష నమ్మితి
గాపాడుమిక నన్ను కంసవైరి
దండించు ఖండించు తండ్రి నీవేయంచు
గట్టిగా నేపట్టు బట్టియుంటి

తే. నీవువీడిన విడువనే నిశ్చయముగ
కాన దర్శనమిమ్మింక గరుడగమన ॥దురిత॥ 61

సీ. ప్రమదమ్ముతో నినుఁ బల్మాఱు వినుతింప
జిహ్వతో మధువు భుజించినట్లు
క్షేమాంకమైన నీ నామమ్ము సోకిన
కుండలాలు చెవులకుంచినట్లు
సాష్టాంగమగు నమస్కారమ్మొసర్చిన
కరమున కంకణాల్ గట్టినట్లు
పుణ్యక్షేత్రాలకుం బోదలంచిన హేమ
నూపురమ్ములు కాళ్ళ నుంచినట్లు
తే. గరుడవాహన నీవు నాకనులబడిన
మోక్షగూపారమందున మునిగినట్లు ॥దురిత॥ 62

సీ. పరివారు నీనామస్మరణ చేయుగఁ జూచి
మదినుబ్బి దేహమే మఱచిపోయి
దాసులెవ్వరునైన నీసుచరిత్రమ్ము
చదువంగ నానందమొదవఁ గులికి
నీమంగళాకృతి నెదుట గాంచినయంత
కనులనందాశ్రువుల్ గ్రమ్మ మ్రొక్కి
హరిరామహరి రామ హరిజానకీప్రియా
యనుచు నోటను నెప్పుడనుచుచుండి
తే. డెందమున నీపదాబ్జమ్ము లందముగను
నిలిపి యుంచినవాఁడెపో నీకు హితుడు ॥దురిత॥ 63

సీ. అండజవాహనా! దండంబు దండంబు
సుందరాంగా! నీకు వందనమ్ము
వామదేవార్చితా! వసుధ నీకు జయమ్ము
మందరగిరిధరా! మమ్ముఁగావు
చక్రధారీ! నీకు చాల నమస్కృతుల్
శుక్రశిష్యాంతకా! శుభము శుభము
మకరకుండల ధరా! మాధవా! రక్షింపు
కనకాంబరధరా! కలుగు మేలు

తే. నిత్యభద్రమ్ములగుగాక నీకు వరద
నమ్మినాడను నన్నేలు నళిననాభ॥ దురిత॥ 64

సీ. పరనారి ముఖపద్మ మరసినంతనె మోహి
తాత్ములై చెడెదరీ యవని జనులు
క్షణభంగురమ్మైన సౌందర్య కాంక్షచే
ప్రణయబంధాలలో బద్ధులగుచు
నత్యల్ప సుఖమున కాశింతురే గాని
శాశ్వతమ్ము దెలియ జాలరయ్య
ముక్తికాంతను గాంచి మోదమ్ముతో చేర
భక్తి పదమ్మునఁ బరగువారు

తే. ప్రమద మొప్పార నీచెంత బ్రతుకుచుండి
తిరిగి రారయ్య పుడమికి దీనులగుచు॥ దురిత॥ 65

సీ. కమలాయతాక్ష నా కన్నులఁ బడవేమి ?
కాన్పింప నీ కున్న ఘనత చెడునె
కుటిలమానసుడంచు యిట్లు లెంచినాడవే?
ఘంటాసురుండెట్టి ఘనుఁడు చెప్పుము
ద్రోహి నంచు నా వేళ నూరకుండు చుంటివా?
పౌలస్త్యుఁడేపాటి భక్తుఁడయ్యె
భూతహింసకుడంచు రోఁత చెందుచునుంటె?
కనకకశిపుడెంత వినయయుతుడు

తే. వీరినందరి నేరీతి యేరికాచి
నావు నేనెంత వేడినఁ గావవేమి॥ దురిత॥ 66

సీ. బిసరుహాదళ నేత్ర వసుమతీహిత ఉమా
సతికిని హితనామ సద్గుణుండ
అంబుజోదర సుందరాకార లోకేశ
దీనబాంధవ మాకు దిక్కు నీవె
వనమాలి నిన్ను నే వర్ణించుటెగాని
పారుష్యముగ నేరి చేరి పొగడ
ఆత్మభూజనక ఓ హర్యక్ష శౌర్య ని
న్నర్చించుటెగాని అన్యమేమి

తే. తెలియజాలని మూఢుండ దీనజనుడ
చెంతఁ జేర్చుము నను రమాకాంత వేగ॥ దురిత॥ 67

సీ. నవసరోజ దళాక్ష నమ్మినాడను చాల
ధాతనుగన్న అధర్మవైరి
యోగీశ్వరేశ్వర యోగార్చితా! వర
భోగిస్ఫటాగాగ్రిన బాగుగాను
నాట్యమ్ము సల్పిన నగధరా! ప్రహ్లాద
వరదా! భవద్దాస పదుడనేను
సమ్మదమ్మున నీదు సదనమ్ము చేరగా
ధ్యానించుచుంటి నో దాసవారి
తే. అసిత దేహాండ ననుగావు మబ్జనాభ
కుముదహిత శత తేజ యోగ్రశనులు ప్రో॥ దురిత॥ 68

సీ. అంబరమ్మునఁ జుక్కలన్ని గూడగవచ్చు
సృష్టిజీవుల పేర్లు చెప్పవచ్చు
వారిద పథమందుఁ జేరి తిరుగవచ్చు
గోరోమముల సంఖ్య గూడపచ్చు
జలచరమ్ముల భంగి సలిలమ్ము చొరవచ్చు
భూరేణువుల లెక్క బోల్పవచ్చు
పంచబాణుని మించు బహు రూపిగావచ్చు
శాస్త్రమ్ములెన్నగా చదువవచ్చు
తే. కాని నీమహిమ మెరుంగగా తరమ్మె
భవునకైనను అల శచీధవునకైన॥ దురిత॥ 69

సీ. వైకుంఠపురమందు వైభవమ్ముల నొప్పు
వాఁడవా! వనముల వనరులెల్ల
మానవహృదయాల మసలుచుండెడి నీవు
దనుజుల మాయలం దగులులెల్ల
అలర మా దేవిని కాలునై యుండఁగా
దార్కై దుఃఖిమ్ము మీరులెల్ల
దిక్పాలకాదిగా దేవ దూతలు గల్గ
మర్కటమ్ముల సాయమును గుల్గో
తే. పంక్తికంఠుని బరిమార్చుపను లన్నెల్ల
భక్త సంరక్షణకు గాదె? పరమపురుష॥ దురిత॥ 70

సీ. సర్వేశభూతేశ సత్వగుణాతీత
భవదీయ దర్శనభాగ్య మొప్ప
వొసగెదవో దేవ బిసరుహాసనుహితా
కృపజూడు మింకనైనఁ గృష్ణవర్ణ
యాగభోక్తవునీవు భోగిపర్యంకాన
బాగుగా శయనించు భవవిదూర
కరిరాజవరద ఓ కనకాంబరవిభాసి
క్రోధరూపివైన వాడ వేగ
తే. దనుజమర్దన వనజాక్ష దాసపోష
శంక లేకుండ గాపాడు మింక నన్ను ॥దురిత॥ 71

సీ॥ సాగరమ్మే నీకు బావగారైన నెలవయ్యె
జీవితమ్మే లెస్స జెలగుచుండె
శ్రీకాంత నిను సదా సేవింపుచుండగా
విభవమ్ముకింతయు వెలితి లేదు
ధరణీసతియె నిన్ను వరియించియుండగా
కలుగుచుండెను పంట కఱవు లేక
నిర్జరేంద్రాదులే నిన్ను సేవింపగా
సేవకుల్ లేరను చింత లేదు
తే॥ ఇట్టి ఐశ్వర్యమెంతయో యిమిడియుండ
దాసజనులకు గ్రాసమ్ము తక్కువేమి? ॥దురిత॥ 72

సీ. శ్రీరామ నీసేవ చేయుచుండుటె గాని
ధనమదాంధుల చెంత చనినుతింప
భూరి సంపదలీయ భారమ్ము గాదోప
పొట్టకు సరిపడ బెట్టుచుండు
గొప్ప కార్యమ్ము నా శక్తిని బోషింప
పరులు విన్నను నవ్వుపాలుగాదె
నీసేవకుండనై నే బాధపడుచుండ
నిత్యప్రమోదమే నీకు దేవ
తే. సుమహితస్వాంత నేనిట్లు శ్రమలుపడుటఁ
జూచియే యూరకుందువే సుజనవినుత ॥దురిత॥ 73

సీ. భానువంశమ్మందు ప్రఖ్యాతిగాంచిన
దశరథునకు ప్రియ తనయుడయ్యె
సౌమిత్రియు భరత శత్రుఘ్నులనువారు
సోదరులై యుండ సుభగుడయ్యె
ధరణీతనూజనే వరియింపనెంచి యా
భవువిల్లు విఱచిన బలుఁడవయ్యె
అనిలాత్మజుండె నిన్ననిశమ్ము భక్తితో
సేవింపమనిపట్టె దేవుడయ్యె

తే. సన్నుతించెడి యీభక్తు విన్నపంబు
వినకయుండుట దగునయ్య వనజనేత్ర ॥మరత॥ 74

సీ. భోగిపర్యంకాన బాగుగా శయనించి
లక్ష్మితో ముచ్చట లాడువాఁడ
నాభిలో వెలువడ్డ నళినమ్ములోఁగల
బ్రహ్మతో సర్వదా పలుకువాఁడ
సనకసనందాది మునిబృంద మేవచ్చి
నతిఁజేయ మదిఁవాల నుబ్బువాఁడ
నారద తుంబురుల్ కోరి పాడుచునుండ
చిఱునవ్వు మోముపై జెలగువాఁడ

తే. విశ్వమందున ననిమిష విభునితోడ
పూజలంబొందుచున్న ఓ పుణ్యపురుష ॥మరి॥ 75

సీ. ఎంతవేడిన నినుమంత్రైన దయలేదె
ప్రార్థింపనొక్కింత పలుకవేమి
కంజాతనాథ నా కలయందు నీ ముద్దు
మోమైనఁ జూపింపవేమి దేవ
శరణంచు వేఁడినఁ గరుణింపవలెఁగాని
నిరసింపదగునయ్య నీకు వరద
భవదీయదాసుండ పరికించి ననుచూడు
పరులుగాతురె? నన్ను సరసిజాక్ష

తే॥ శంకలను వీడి నేఁడు నావంకఁజేరి
దర్శనమ్మిచ్చి కాపాడు దాపవరుడ ॥దురిత॥ 76

సీ. శ్రీరాము నేప్రొద్దు సేవించువారెల్ల
కోరి వైకుంఠమే చేరుకొంద్రు
కంజాక్ష నీపాద కంజమ్ములన్ గొల్చి
వసుధలో చరియించువారె! ఘనులు
నీనామకీర్తనల్ నేర్పొప్పగాపాడు
వాని పాపమ్ములే! వదలిపోవు
కాంచనమార్జించు ఘనులెందరైనను
స్వామి నీదాసుల సాటిగారు

తే. త్యాగియైనను నిశ్చల భోగియైన
సాటిరారయ్య నీభక్తజనులతోడ ॥దురిత॥ 77

సీ. జనకుడు, మాంధాత, సనకసనందన
శంతనుసుత, పరాశరులు వ్యాస
జైమిని వాసిష్ఠ శౌనక సూతాది
పరమ భాగవతులు వరదనిన్ను
సదమలభక్తితో హృది జపమ్మొనరించి
చేరగల్గిరి నిన్ను వారుదేవ
పాపవారాశిలో పతితుండనై యుంటి
సరియైన నీనామ స్మరణలేక

తే. బాధపడుచుండ నన్నుఁగాపాడ గోరు
వారులేరయ్య నినుఁ గొల్చువాడనెపుడు ॥దురిత॥ 78

సీ. శూరసేనుని ప్రియసూను కుద్భవమంది
మందలోపలఁజేరి యందు బెరఁగి
నందాదిగా గోపబృందమ్ములనుగావ
విమలమౌ కాంతారవీధులందు
శకటతృణావర్త బకధేనుకాసుర
పూతనాదిఖలులఁ బుడమిగూల్చి
గోవర్ధనమ్మెత్తి గోగోపకులఁగాచి
అశనిధరుని గర్వమడఁచివైచి

తే. తల్లిదండ్రుల చెఱఁబాప తరలిపోయి
మల్లురనుగూల్చు నిన్ను నే మఱువనయ్య ॥దురిత॥ 79

సీ. మామగ దెగటార్చి మగధేశువంచించి
కాలయవను గుహపాలుచేసి
శిశుపాల పౌండ్రక క్షితితలేశుల గూల్చి
ద్వారకాపురమం దుదారలీల
వర్తింపుచుండి ఓ వనరుహాయత నేత్ర
పతితులైనట్టి యపాండుసుతుల
కరుణించి దురములో కౌరవేయుల గూల్చి
ధర్మజునకు ధాత్రి దయనొసంగి
తే. పార్థసారథి యితడనం బ్రణుతికెక్కి-
నట్టి కృష్ణావతారమ్ము నాత్మదలతు ॥దురిత॥ 80

సీ. భువి పురీషమ్ముచే పొట్టనింపెడి ఘోణి
ఆమ్రఫలరసమ్ము నరయగలదె?
కోరి మీనులదిను గొక్కెర యెప్పుడైన
క్షీరాన్నసారమ్ము చెందగలదె?
కర్కటమ్ముల మెక్కి కడుపునింపెడి నక్క
మకరందమాధుర్య మందగలదె?
బహుమాంసమును తిను బలిపుష్టకమ్ముల
పీయూషమ్మును హాయి మేయగలదె?
తే. హీనదైవమ్ములన్ గొల్చు దీనుడెపుడు
భవ్యమైనట్టి నీకృపాపాత్రుడగునె ॥దురిత॥ 81

సీ. సంకర్షణానుజ సత్యవాక్పరిపాల
కౌస్తుభమణిధరా గరుడవాహ
గీర్వాణపతినుతా శర్వాణినుతనామ
కనకభూషణధరా! కమలనాభ
విశ్వస్వరూప! ఓ వేదాంతవేద్యుండ
పన్నగాశనవాహా! పద్మనయన
అసురేంద్రసంహార! ఆద్యంతరహిత ఓ
శంఖచక్రగదాబ్జ శార్ఙ్గహస్త

తే. పంచబాణుని జనక ఓ భక్తలోల
సమ్మదమ్మునగొల్తునే నెమ్మనమున ॥దురిత॥ 82

సీ. కపిలుండవై పుట్టి విపినాంతరమ్ముల
దేవహూతికి భక్తిఁ దెలిపినావు
జమదగ్నిసుతుడవై జగతిలోగల దుష్ట
నరనాథశిరములు నఱికినావు
ప్రొద్దుపట్టికి దక్షపుత్రి కుద్భవమంది
బదరికావనమందుఁ బరఁగినావు
వైన్యుండవై మున్ను వసుధ గోవును జేసి
నోషధీచయముల నొడిసినావు

తే. కౌసలేయుండవై ఘోరకాననమున
దనుజనాథుల బెక్కండ్ర దునిమినావు ॥దురిత॥ 83

సీ. దీనులగాంచి నేదిట్టనేర్చితిగాని
చేరి సాయమొకింత జేయనైతి
క్రూరుల చరితముల్ గోరి వింటినికాని
వేడ్కతో నీకథల్ వినగనైతి
పరవిత్తమున కాశపడియుంటినేగాని
దానముల్ జేయగా దలుపనైతి
ప్రమదమ్ముతోడ పాపములుచేసితిగాని
చాలపుణ్యము చేయఁజాలనైతి

తే. అవనియందున నేజన్మమంది నందు
కేంత ఫలమున్నదే? రమాకాంతయింక ॥దురిత॥ 84

సీ. శిలదెప్పగాఁజేసి జలధియీఁదినయట్లు
ఫణిఫణమ్మున భేకి పండినట్లు
యీఁతనేర్వక పెద్దనూతిలో పడినట్లు
ద్రోణమున్ కాలితో ద్రొక్కినట్లు
తాళవృక్షమునీడ చాలసేవున్నట్లు
పులితోడఁ గూరిమిన్ సలిపినట్లు
కనులుమూసుక ముండ్లకంపఁ జొచ్చినయట్లు
గంగయొడ్డున యిల్లుకట్టినట్లు

తే. దేవ నీసేవకులు చాల తెలివి దప్పి
దుష్ట సహవాసమొనరింప కష్టమొదవు ॥దురిత॥ 85

సీ. ధాత్రిపై నేజన్మ దాల్చినప్పటినుండి
ధర్మార్థమిసుమంత తలఁచితొటుఁగ
కేశవా! యని నిన్ను కేశమైనను భక్తి
భావమ్ముతో నోటఁ బలికితొటుఁగ
నీదాసులంగాంచి నిందించుటేగాని
చేరి నమస్కృతుల్ చేసితొటుఁగ
గౌతమీకృష్ణాది స్రోతస్వినుల కేఁగి
స్నానసంధ్యాదుల జరిపితొటుఁగ
తే. జగతి చెడుకార్యములు పెక్కు సలిపియుంటి
నాదు కలుషమ్ములంబాపు నాగశయన ॥దురిత॥ 86

సీ. గజమును బ్రోచుట నిజముగాదుగ, నయ్య
హల్యను రక్షించు టాదికల్ల
ప్రహ్లాదుగాచుట ప్రఖ్యాతిగాదిలన్
బాండుపుత్రులుగావ గండుతనము
అవ్విభీషణుఁగాచు టాశ్చర్యకార్యమే
వాలీయువిడచుటల్ గల్లకల్ల
సుగ్రీవునేలుట శూరత్వమేయొన్న
గుహునాదరించుట గొప్పఁదనము
తే. దుష్టమనుజుండ క్రూరుండ కష్టరతుండ
నన్నురక్షింప నిందుపై వన్నె నిజము ॥దురిత॥ 87

సీ. ఇనకులాంబుధిచంద్ర! యిందీవరశ్యామ!
సాగరగంభీర! భోగిశయన!
ఖగకులాధిపవాహ! కౌస్తుభాలంకార!
సత్యభామాప్రియా! సాధువినుత!
వారధిబంధనా! నీరజదళనేత్ర!
దశకంఠమర్దనా! దాసపోష!
త్ర్యంబకసఖునుతా! జంభారినన్నుతా!
అంబుజోదర! దేవ! అమితరూప!

తే. క్షీరసాగరశయన! ఓ శిష్టపోష!
మదన శతకోటిలావణ్య! మమ్ముఁబ్రోవు ॥దురిత॥ 88

సీ. పంచభూతములందు పావనమ్మగు గంగ
ప్రవహించెనే యట్టి పాదములకు
గౌతమముని కాంత కటికరాయైయుండ
పడతిగా జేసిన పాదములకు
బలిచక్రవర్తిమున్ పఖ్యాతిగా తలన్
భయభక్తిఁ దాల్చిన పాదములకు
ఇందిరారమణి యానందమ్ముతో నుబ్బి
బల్మారునొత్తెడి పాదములకు

తే. భక్తవరు లెప్పుడును మ్రొక్కు పాదములకు
వందనము చేయుచుందు నానందమొప్ప॥ దురిత॥ 89

సీ. కాళిందిలో చేరి వ్యాళమున్ గూల్చిన
దైత్యవంశాంతకా! దండమయ్యా
మారీచ తాటకి క్రూరులఁ జంపిన
తాపసార్చిత! నీకు దండమయ్యా
ధశరథ వరపుత్ర! ధరణీశ! రఘురామ!
భండన భీముఁడా! దండమయ్యా
గోపాల వినుత! ఓ గోపికా వ్రాత్ చోర
ధరణీజహిత నీకు దండమయ్యా
తే. కుసుమశరు తండ్రి మధురిపు బిసరుహాక్ష
కమల సంభవజనక ఓ విమలచరిత॥ దురిత॥ 90

సీ. ఇలలోన నీదాసు లెందఱో ఘనకవుల్
గద్య పద్య విచిత్ర కావ్యములను
కృతినొసంగిరి నీకు నతి విపులమ్ముగా
వర్ణించి రిల జనవందితముగ
ధీ హీనుఁడను చాల దీనుండ నజ్ఞాన
కూపమ్ములోపలఁ గూలియుండి
పద్యరూపమ్ముతోఁ బ్రార్థించితిన్ దయా
మితరశ్మిఁ బఱపి దుర్మతిని నన్ను
తే. చేరఁగాదీసి మన్నించి చిత్తగించి
భక్తబృందమ్ములోఁ జేర్పు వత్సలతను॥ దురిత॥ 91

సీ. ధరణిలోఁగల చోడవరపురాధిపుఁడైన
రామభూపాలు నిరంతరమ్ము
సేవించి యాదేవు శ్రితదయారసముచే
కబ్బమ్ము నేర్చి యక్కమల నాభు
సన్నుతింపుచుఁ జెప్పె శతకమ్ము నొకటి, రా
జంరాజ కవిబుధ సమ్మతముగ
భక్తితో నెవ్వారు పఠియింతురో! వారి
పాప సంఘములెల్లఁ బాసిపోవు

తే. సర్వదా దీని పఠియించు సాధువులకు
భవ్యవైకుంఠ పదమొ! సంప్రాప్తమగును॥ దురిత॥ 92

సంపూర్ణము.

